# ఆకాశ దీపపూజ

ఆకాశ దీపపూజ

డీసీ

ఆకాశే దీయమానోదీపః । "తులాయాం తిలతైలేన సాయంసన్ధ్యాసమాగమే । ఆకాశదీపం యో దద్యాత్ మాసమేకం నిరన్తరమ్" బ్రహ్మాణ్డపు0 ఉక్తే తులాస్థరవౌ సాయముచ్ఛస్థానే దీయమానే దీపే ।

ఆకాశ దీపం వెలిగించి దీప శిఖలో దామోదరుణ్ణి కానీ, త్రయంబకుడిని కానీ ఆవాహన చేసి యథాశక్తి పంచోపచారాదులతో పూజించి...

## కార్తీక దామోదర నామావళి

1. ఓం కేశవాయ నమః
2. ఓం నారాయణాయ నమః
3. ఓం మాధవాయ నమః
4. ఓం గోవిన్దాయ నమః
5. ఓం విష్ణవే నమః
6. ఓం మధుసూదనాయ నమః
7. ఓం త్రివిక్రమాయ నమః
8. ఓం వామనాయ నమః
9. ఓం శ్రీధరాయ నమః
10. ఓం హృషీకేశాయ నమః
11. ఓం పద్మనాభాయ నమః
12. ఓం దామోదరాయ నమః
13. ఓం సంకర్షణాయ నమః
14. ఓం వాసుదేవాయ నమః
15. ఓం ప్రద్యుమ్నాయ నమః
16. ఓం అనిరుద్ధాయ నమః
17. ఓం పురుషోత్తమాయ నమః
18. ఓం అధోక్షజాయ నమః
19. ఓం నారసింహాయ నమః
20. ఓం అచ్యుతాయ నమః
21 ఓం జనార్దనాయ నమః
22. ఓం ఉపేంద్రాయ నమః
23. ఓం హరయే నమః
24. ఓం శ్రీకృష్ణాయ నమః

## కార్తికోక్త, లఘు షోడశోపచార పూజా విధానము

| | | | | |
|---|---|---|---|---|
| 1. ఓం శంకరాయ నమః | - | ఆవాహనం | - | సమర్పయామి |
| 2. వృషధ్వజాయ నమః | - | ధ్యానం | - | సమర్పయామి |
| 3. గౌరీప్రియాయ నమః | - | పాద్యం | - | సమర్పయామి |
| 4. లోకేశ్వరాయ నమః | - | అర్ఘ్యం | - | సమర్పయామి |
| 5. రుద్రాయ నమః | - | ఆచమనీయం | - | సమర్పయామి |
| 6. గంగాధరాయ నమః | - | స్నానం | - | సమర్పయామి |
| 7. ఆశాంబరాయ నమః | - | వస్త్రం | - | సమర్పయామి |
| 8. జగన్నాథాయ నమః | - | ఉపవీతం | - | సమర్పయామి |
| 9. కపాలధారిణే నమః | - | శ్రీగంధం | - | సమర్పయామి |
| 10. ఈశ్వరాయ నమః | - | అక్షతాన్ | - | సమర్పయామి |
| 11. పూర్ణగుణాత్మనే నమః | - | పుష్పం | - | సమర్పయామి |
| 12. తేజోరూపాయ నమః | - | దీపం | - | సమర్పయామి |
| 13. లోకరక్షకాయ నమః | - | నైవేద్యం | - | సమర్పయామి |
| 14. లోకసాక్షిణే నమః | - | తాంబూలం | - | సమర్పయామి |
| 15. భవాయ నమః | - | ప్రదక్షిణం | - | సమర్పయామి |
| 16. కపాలినే నమః | - | నమస్కారం | - | సమర్పయామి |

# డీసీ

డీసీ

పూజ తర్వాత దీపాన్ని ఈ శ్లోకం చదువుతూ నమస్కరించాలి.

కీటాః పతంగాః మశకాశ్చ వృక్షాః
జలే స్థలే యే నివసంతి జీవాః!
దృష్ట్వా ప్రదీపం నచ జన్మ భాగినః
భవంతి నిత్యం శ్వపచాహి విప్రాః!!
(భవంతి త్వం శ్వపచాహి విప్రాః!!)

వివరణ:-

అది కార్తీక ఆకాశ దీపం
దానికి నమస్కారం చేయాలి.
ఆ దీపం చాలా గొప్పది.
ఆ దీపపు వెలుతురు మనమీద పడినా చాలు.

కీటాశ్చ - పురుగులు; మశకాశ్చ - దోమలు, ఈగలు మొదలైనవి, అంతే కాదు చెరువు ఉంది అనుకోండి అందులో రకరకాలైన పురుగులు ఉంటాయి. అవి జ్యోతి చూడగానే ఎగిరి వస్తాయి. నీటిలో ఉన్న పురుగులు, భూమిమ ఉన్నటువంటి పురుగులు ఇవన్నీ దీపం ఎక్కడ ఉందో అక్కడికి వచ్చేస్తాయి. ఇవన్నీ కూడా ఈ దీపం వెలుతురు ఎంత దూరం పడుతోందో ఈ దీపాన్ని ఏవేవి చూస్తున్నాయో ఆఖరికి చెట్లు కూడా అవన్నీ కూడా భగవంతుణ్ణి పొందుగాక! వాటికి ఉత్తరోత్తర జన్మలు తగ్గిపోవుగాక!

అవి తొందరలో మనుష్య జన్మ పొంది ఈశ్వరుని అనుగ్రహాన్ని పొంది ఈశ్వర కర్మానుష్ఠానము చేసి భగవంతుణ్ణి చేరుగాక! అని శ్లోకం చెప్పి దీపం వెలిగించి నమస్కరిస్తారు. ఇది మనుష్యులు మాత్రమే చేయగలిగినటువంటి గొప్ప విశేషం.

దీపపు కాంతి పడితేనే అవి అంత గొప్ప ప్రయోజనాన్ని పొందితే ఇక ఆ దీపం పెట్టిన వాడు మరెంత ప్రయోజనాన్ని పొందాలి?

డీసీ